ముఖ్యమంత్రి

# అమెరికా పర్యటన

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

## శ్రీ ఎన్. టి. రామారావు

**1984** జూన్ **7**వ తేదీ నుండి జూన్ **21**వ తేదీ వరకు

అమెరికాలో పర్యటించిన సందర్భంగా

ఆయా ప్రదేశాలలో చేసిన ప్రసంగాల సంకలనం

తొలి ప్రచురణ : 1984 జూలై 15

ప్రతులు : 25,000

ముఖచిత్రం : న్యూయార్కులో తెలుగు ఆడపడుచులు
ముఖ్యమంత్రికి సాంప్రదాయసిద్ధంగా చెప్తున్న స్వాగతం.

ప్రచురణ :

కమీషనర్

సమాచార, పౌర సంబంధశాఖ, గృహకల్ప

హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్

# ముందు నా మాట

అనురాగం కురిపిస్తూ నా ఆహ్వానాన్ని మన్నించి యీ ప్రజాసదస్సుకు విచ్చేసిన ఆత్మబంధువులకు, ఆడపడుచులకు, అన్నదమ్ములకు, పెద్దలకు స్వాగతం......సుస్వాగతం.

ఒకే రక్తం పంచుకు పుట్టిన ఒకేతల్లి బిడ్డకన్న మిన్నగా నన్ను ఆదరిస్తున్నారు, గౌరవిస్తున్నారు.

ప్రజాస్వామ్య సిద్ధాంత సూత్రానుసారం మీ ప్రతినిధిని నేను. నా పరంగా ఏ కార్యక్రమం నిర్వహించబడ్డా మీకు ఎరుకపరచటం, న్యాయ నిర్ణేతలుగా గౌరవించటం నా బాధ్యత, నా ధర్మం, నా కర్తవ్యం.

కనుకనే ఆహ్వానించాను—నా అమెరికా పయనం ఎందుకు?.....ఏది సాధించడానికి? ......ఏ ఘనత నా దేశానికి, నా రాష్ట్రానికి సంతరించడానికి ? -- అన్నది నిర్ధారించవలసిన నిర్ణేతలుగా.

ప్రజావాణి యీ ప్రజాస్వామ్యయుగంలో పాలకులకు బ్రహ్మవాక్కు కావాలి.

—ఇది నా అంతర్యంలోని భావన.

—ఇది నావారికి నిండు మనస్సుతో నేనిచ్చే గౌరవం.

ఈ విదేశ పయనం యీనాటి సాంప్రదాయంకాదు. ఇతర దేశాలతో సంబంధాలు సంతరించుకునే విధానం ఎప్పుడో ఏనాడో పాశ్చాత్య నాగరికత కళ్ళుతెరవనినాడే తెలుసుకున్నది మన భారతదేశం. ఐరోపా ఖండాలతో అందుకున్నది వియ్యం...అందించింది నెయ్యం.

పారిశ్రామిక ప్రగతికి గుర్తింపు తెచ్చింది ఖండాంతర ఖ్యాతి ఆర్జించిన చీనిచీనాంబరాలతో, విలువైన ధగద్ధగల జరీదుకూలాల **ఎగుమతులతో.**

అగ్గిపెట్టెలో మడిచి మలిచారట నిడివిగల సొంపైన దక్కన్ మజ్లిన్‌చీరలు. ఆనాడే అంత పేరెన్నికగన్నది యీ దక్షిణ పీఠభూమి చేనేత పారిశ్రామిక కళాకౌశలంతో.

శాతవాహనులనాడే తెరచాపలు విప్పుకొని రెపరెపలాడాయి నీలి ఆకాశంలో, తెల్లని మబ్బుతెరల్లో. సిరికడలి అలలపై నిండుగా తేలి ఆడాయి ఘన వాణిజ్యనౌకలు — సిరిసంపదలతో, ఆర్థిక సంపత్తితో.

మచిలీపట్టణం, కళింగపట్నణం, చెన్నపట్టణం, మోటుపల్లి, తాళ్ళరేవు, వాడరేవు మొదలైన రేవులనుంచి వాణిజ్యం ఉవ్వెత్తుగా సాగిందట—పులకింతలతో, పలవరింతలతో.

జమైకా, జావా, సుమిత్రా, బోర్నియో మొదలైన దీవుల సుగంధ పరిమళాల గుబాళింపులు తెలుగునాట పరిమళించాయట—సుమనోహరంగా, విలాసంగా, వొయ్యారంగా.

గ్రీకు, రోమన్ రాయబారులు భారతీయ పరిపాలనా విధానాలను, సుస్థిర సామాజిక వికాసానికి, ప్రతిష్ఠమైన అర్థశాస్త్రనైపుణీ విధానాలను, రాజ్యాంగ సంవిధానాలను పరిశీలించటానికి పవిత్రంగా విచ్చేశారట...... నెలవైనారట—గుప్తరాజుల స్వర్ణయుగంలో.

పారశీక రాయబారులు పరవశించి పరవళ్ళు తొక్కుతూ పొగిడారట—రాయలేలిన సీమరా యిది......రతనాల సీమరా—అని.

చరిత్ర పుటలపై సువర్ణాక్షరాలతో లిఖించారు—విజయనగర ప్రాభవాలను, కనిష్కుని రాజ్యాంగ విధానాలను, రాజవీధులలో నిలువెత్తు రత్నరాసులుపోసి నిర్భయంగా బేహారులు చేసిన బేరాలను— మంత్రముగ్ధులై... సమ్మోహితులై.

నాగార్జునాచార్యుల విద్యాపీఠానికి వలసవచ్చారట విదేశీజిజ్ఞాసువులు —మత విశేషాల నందుకోడానికి, సత్యధర్మాలను గ్రహించడానికి.

సమాజ సంస్కారానికి, మానవ మేధస్సు వికాసానికి ఈ గడ్డమీద వెలుగుగా వెలసిన బౌద్ధం, మానవ సామాజిక జీవిత విధానాలకు నిర్వచనం చెప్పిన బౌద్ధం సుదూర తీరాలు గడిచి విస్తరించిందట—సింహళ, బర్మా చైనా, జపాన్ మొదలైన దేశాలలో ఆరాధ్యమై, అనుష్ఠానమై.

కర్నాటాంధ్ర మహా సామ్రాజ్యాధినేత కృష్ణరాయని కలలో సాక్షాత్కరించిన శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు తెలుగు నుడికారాలలోని తీయందనాలను తెలియజెప్పాడట—తేటతెల్లంగా-

తెలుగదేల యన్న దేశంబు తెలుగు, ఏను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
ఎల్ల నృపులు గొలువ ఎరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స —అని.

ఆ ప్రబోధంతో పులకించిన కృష్ణరాయని మధుర మంజుల మనోజ్ఞ సువిలాస లేఖినినుండి వెలువడిందట మహారస ప్రబంధకావ్యం— ఆముక్తమాల్యద.

కాకతీయుల కరవాలాల కణకణలతో, రాణి రుద్రమ వీర విక్రమ విన్యాస శోభలతో పరవశించిందట తెలుగునాడు ఆనాడు.

కొండవీటి రెడ్డిరాజుల ప్రాభవం, గజపతుల వీర విక్రమ పరాక్రమం, వెలమ మన్నీళ్ళ మెలితిరిగిన మీసాల రోషం, విజయనగర రాజశేఖరుల వీర విహారం తెలుగుతల్లి పాదాలకు పారాణి అలదిందట— శాత్రవచ్ఛమూ సమూహ రుధిర స్రవంతితో, అసిధారలతో.

ఈ తెలుగు గడ్డమీద తెంపరులై తొడజరిచి మగటిమితో నిలిచారట కమ్మలు, కాపులు, మాలలు, మగటి ధీరులు... ఎందరో... మరెందరో.

అలనాటి నాగమ్మ మంత్రాంగం రాజనీతిపై మంత్రాభిషేకం.

మగనికే వీరతిలకం దిద్ది కదనభూమికంపిన మగువ మాంచాల వీర పత్నీవ్రతం వీరనారుల సాంప్రదాయానికే తలమానికం.

మానవ సమాజంలో సమ సమానతకు నాడే నాంది పలికింది పలనాటి బ్రహ్మన్న చాపకూటి సిద్ధాంతం.

బడుగువర్గాల ప్రతినిధిగా అలనాటి తెలుగునాటి పలనాటి సైన్యసమూహాలకు సర్వాధిపత్యాన్ని కట్టబెట్టింది మాల కన్నమదాసుకు ఆనాటి సాంఘిక దురాచార నిర్మూలనా ప్రభావం, అంటరానితనానికి అతీతమైన భావం.

ఆవేశోద్దీపితమైన బాలచంద్రుని వీర విజృంభణం యువకులకే ఆదర్శంగా నిలిచింది— దేశభక్తి ప్రేరితమై, ఉడుకు రక్తానికి వారసత్వమై.

అవి ఆనాటి కలలైతే యీనాటి సత్యాలు కళ్ళముందు కదలాడు తున్నాయి కొల్లలుగా. . . . కోకొల్లలుగా.

బ్రిటిష్ ముష్కర సామ్రాజ్యవాద నియంతృత్వ విధానాన్ని యీ గడ్డమీద తుడిచిపెట్టడానికి, భారతమాత దాస్య శృంఖలాలు ఛేదించడానికి ఎందరో తెలుగుబిడ్డలు ఆత్మార్పణ చేశారు. . . . అమరులయ్యారు.

మన్యంలో మొలిచిన ప్రతి మొక్క గళమెత్తి పాడుతుంది— అలనాటి విప్లవజ్యోతి అల్లూరి సీతారామరాజు వీర విక్రమ పరాక్రమం.

అహింసా ప్రవచనంతో, సత్యాగ్రహ వినూత్న ప్రయోగంతో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనను సాగరతీరాలు దాటించి సాగనంపిన భరతమాత ముద్దుబిడ్డడు— మహాత్మగాంధి.

పునీతమయ్యింది దేశం.

స్వతంత్రం పీల్చుకుని రెక్కలు విప్పి రెపరెపలాడింది స్వేచ్ఛా వీచికా విహంగం— పంతొమ్మిది వందల నలభై ఏడు ఆగస్టు పదిహేనవ తేదీన.

స్వాతంత్ర్యం వచ్చింది దేశానికి.

కాని, ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి రాలేదు తెలుగు జాతికి.

భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన అమలు పరిచేందుకు అసువు లర్పించాడు అమరజీవి పొట్టి శ్రీరాములు.

అంతటి త్యాగాలతో సాధించారు తెలుగు బిడ్డలు స్వతంత్ర భారత దేశం, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం.

స్వతంత్ర స్ఫూర్తికి, జాతి ప్రగతికి ప్రతిధ్వనించింది— అమరకవి గురజాడ కంఠం—

సొంతలాభం కొంత మానుక
పొరుగువాడికి తోడు పడవోయ్
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్ — అని.

అది గుర్తుకు తెచ్చుకున్న ఆశతో పైకి లేచారు, నింగివైపు చూచారు—అభాగ్యులు, నిర్భాగ్యులు, దౌర్భాగ్యులు, దళితులు, పీడితులు— స్వాతంత్ర్యం తమకేదో తెస్తుందని, చిరకాలపు ఆర్థిక బానిసత్వం, పేదరికం తొలగిస్తుందని, మానవ సమాజంలో స్వార్థం నశిసిపోతుందని.

ఆనాటినుంచీ సాగింది అదే పెత్తనం.

ఫలితం .... ఫలితం.... ఫలితం ... .

1982 మార్చి 29 వ తేదీన నా నోట పలికింది విధి ప్రేరితమై 'తెలుగుదేశం' ఎందుకో .... ఎందుకో .... ఎందుకో.

వెలసింది ఆనాడే తెలుగుదేశం పార్టీ— తెలుగు గడ్డమీద.

ఆడపడుచుల మంగళారతులలో, వీర తిలకాల సంబరాలలో, 'విజయీభవ' అన్న ఆశీః పరంపరలలో, నా తమ్ముళ్ళ వీరావేశ విజృంభణలో, చిరంజీవుల కేరింతలలో పలవరింతలలో మార్మ్రోగింది తెలుగు దేశం.

ఆనాటినుండే కొత్త ఆశలు రేకెత్తుతున్నాయని, నవ్యత నాంది పలుకుతోందని నా మీద ప్రేమాభిమానాలతో ఉత్తరాలు వర్షంగా కురిసాయి— ప్రవాస భారత సోదరీ సోదరులనుండి.

గాలిలో పరవశించాయి.

నాలో నిబ్బరం నింపాయి— వారి అండదండలు, ఆశీస్సులు.

పంతొమ్మిది వందల ఎనభై మూడు జనవరి ఐదవ తేదీన మ్రోగింది విజయ శంఖారావం—

—పెల్లుబికిన ప్రజాసాగరం నినదించిన విజయ నినాదం 'తెలుగు దేశం జిందాబాద్ ... తెలుగుదేశం జిందాబాద్' అని.

ఆప్యాయతతో, ఆదరంతో, ఆకాంక్షతో అన్నకోసం ఎదురుచూస్తున్నామన్న అమెరికాలోని ఆత్మీయుల, భారతీయుల, తెలుగు బిడ్డల పలవరింపులు నన్ను పిలుస్తూనే వున్నాయి— రమ్మనీ, రారమ్మనీ.

తెలుగునాట వెలసిన నూతన ప్రభుత్వ పారిశ్రామిక విధానాలలో, ప్రగతి పథాలలో పాలుపంచుకోదలచామని తెలియపరచింది అక్కడి తెలుగు జనత.

ఆ సదాకాంక్షతోనే అమెరికాలోని తెలుగు శాస్త్రజ్ఞుల బృందం పిట్స్‌బర్గ్ నగరంలో సాంకేతిక పరమైన ఒక పారిశ్రామిక సదస్సును ఏర్పాటుచేస్తూ ప్రత్యేకంగా ఆహ్వానించింది నన్ను— మీరే ఆ కార్యక్రమానికి ప్రారంభం చేయాలని.

నూతన బాధ్యతలలో మునిగిపోయిన నేను ఆమోదించికూడా అందుకోలేకపోయాను వారి ఆహ్వానాన్ని రెండుసార్లు.

విజ్ఞానంతోపాటు భారతీయ సంస్కృతీ వికాసాలకు వారసత్వంతో అక్కడికి వెళ్ళారు మనవారు.

ఆ సమాజంలో అరమరికలు లేక ఇమిడిపోయిన వారి విధానం, ఆ సమాజ సంక్షేమానికి సేవలందించే వారి తీరు, నడవడిక మనందరికీ గర్వకారణం.

ఏ దేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైనా
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

—అన్న ప్రబోధకవి రాయప్రోలు సత్యసూక్తికి నిదర్శనంగా వారు మన సాంప్రదాయాలకు నిజమైన రాయబారులు.

ఈ భావనే నన్ను పంపింది అమెరికాకు యీ తూరి వారి మూడవ ఆహ్వానానికి జవాబుగా.

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ.

నేను ప్రథమంగా భారతీయుడ్ని.

ఆ తరువాతే తెలుగు బిడ్డను— అన్నభావనే స్పష్టం చేశాను అక్కడ మరీ మరీ.

ప్రసంగించాను మూడు భాషలలో— భారతీయ భాషా సంస్కృతీ విధానంతో.

పిట్స్‌బర్గ్ సదస్సులో వెల్లివిరిసిన వారి అనురాగాన్ని నింపుకున్నాను ఎద నిండుగా.

పరవళ్ళు తొక్కింది నా మనస్సు ఆనందంతో మెండుగా.

రాష్ట్రాభివృద్ధి కృషిలో పాలుపంచుకోవాలన్న వారి తాపత్రయం, కృతనిశ్చయం, ఒక స్పష్టమైన అవగాహన నందించింది. ఆచరణాత్మకంగా స్థిరపరచడానికి, అనువైన కార్యక్రమం రూపొందడానికి నాయాత్ర తోడ్పడింది.

వెళ్ళిన అన్ని నగరాలలోనూ భారతీయులు — ప్రత్యేకించి మన తెలుగువారు— అడుగడుగునా నాపై వర్షించిన సుమ సుమనోహరమైన పన్నీటిజల్లును మరువలేను . . . మరువలేను. . . ఎన్నటికీ . . . ఎన్నటికీ.

దాదాపు ఆరువందల యాభై మందికి పైగా పాల్గొన్నారు వివిధ పారిశ్రామిక మహా సభలలో. అందులో సుమారు 172 మంది వెంటనే తమ మాతృభూమికి తరలివచ్చి, పారిశ్రామిక మహాయజ్ఞంలో పాలుపంచుకోవాలన్న ఆతృత వ్యక్తం చేశారు.

తమకు ఆసక్తివున్న వివిధ ప్రణాళికా పథకాలను గురించి నాతో వచ్చిన ఉన్నతాధికారులతోనూ, పారిశ్రామికవేత్తలతోనూ అరమరికలు లేకుండా అహర్నిశలు చర్చించారు. నా యాత్ర ఫలించడానికి సహకరించారు.

అక్కడ అందరూ ఉత్సాహావేశాలతో, అవ్యాజానురాగంతో నాకిచ్చిన స్వాగత సభలలో మీ ప్రతినిధిగా పలికాను— భారతీయ సంస్కృతీ ప్రాభవాన్ని, ప్రపంచ దేశాలకు తలమానికంగా వున్న మన ప్రజాస్వామిక విధానాన్ని, సహకార ఫెడరల్ పరంగా రూపొందుకొన్న మన రాజ్యాంగ సిద్ధాంత స్వరూపాన్ని.

మానవతావాది, మహామనీషి, విజ్ఞాన ప్రాభవుడు, దళితవర్గం నాయకుడు డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ సామాన్య మానవుని పౌర హక్కులను పరిరక్షించే విధానంగా, దళిత బడుగు వర్గాలపట్ల సామాజిక బాధ్యతను స్పష్టంచేసే తీరుగా రచించిన పవిత్ర రాజ్యాంగ విధానం మా పాలనా విధానమని గర్వంతో చెప్పుకున్నాను— భారతీయుడిగా, తెలుగువాడిగా.

పెన్సిల్వేనియా రాష్ట్రంలోని కౌంట్ ఆఫ్ ఎరిఘనీ పాలకవర్గం ఏకాభిప్రాయంతో, అవ్యాజానురాగంతో నాకెంతో ఘనమైన స్వాగతాన్ని సమర్పించింది.

"సుప్రసిద్ధ నటుడై, ఒక రాజకీయ పార్టీ నిర్మాతయై, గత ఎన్నికలలో అఖండ విజయాన్ని అత్యధిక మెజారిటీతో సాధించటమే గాక, భారతదేశంలో మిత్ర పక్షాలన్నింటినీ సమన్వయపరిచి, ఒక్కటై, ఒక్కమాటై పనిచేసే రాజకీయ విధానాన్ని సృష్టించిన గుర్తింపు వీరికే దక్కింది. కనుక ఈ సందర్భంగా మనమధ్యకు వారిని ఆహ్వానించి ప్రార్థనాపూర్వకమైన ఆశా, ఆశీస్సులతో వారి రాక ఉభయతారకమై కళాత్మక, ఆర్థికపరమైన సత్సంబంధాలను నెలకొల్పి; సృష్టికర్త ప్రసాదించిన అన్ని వనరులు, అవకాశాలు అందరి మానవుల అనుభవానికి అందజేసే విధంగా శ్రీ ఎన్. టి. రామారావు గారి కృషి ఫలించాలి"— అని కోరుతూ తీర్మానం చేసింది.

ఉభయ దేశాలు మంచి అవగాహనతో, నిండుదనంతో కలిసిమెలిసి శాంతి, స్వేచ్ఛ, సహకారంతో వర్ధిల్లాలని; సుదూర సాగరతీరాలు దాటి వచ్చిన నా స్నేహభావం, కృషి సాఫల్యం సంతరించుకోవాలని సమాశ్వాసించింది.

పిట్స్‌బర్గ్ మహానగర ప్రథమ పౌరులు మేయర్ శ్రీ రిచర్డ్ ఎస్. కలిగులిగారు నాకు సుహృద్భావపూరితమైన స్వాగతాన్ని తెలియ జేస్తూ నా పిట్స్‌బర్గ్ రాక వాణిజ్య విస్తరణకు సంబంధించిన నూతన విధానానికి, సత్సంబంధాల సదవగాహనకు దోహదకారి కావాలని కోరు కున్నారు.

"మీ సాధనలో మాకు అవగాహన ఉన్నది. అదే ఉభయత్రా సత్ఫలి తాలను అందజేయాలి"— అని అన్నారు.

"ఇక్కడ వున్న భారతీయులు మా సాంఘిక, సాంస్కృతిక, సామా జిక, విద్యా విధానాలలో బాధ్యత కలిగిన భాగస్వాములై మెలుగుతున్నారు. వారెంతో ఉత్సాహంతో మీ రాకకు ఎదురుచూస్తూ, మీ పర్యటన విజయవంతం కావడానికి ఎన్నో పథకాలు సిద్ధపరిచారు. మీరు తిరిగివెళ్ళి మీ దేశ ప్రజలకు నా శుభాకాంక్షలు అందజేయ" మని అర్థించారు.

చికాగో మేయరుగారైన హెరాల్డ్ వాషింగ్‌టన్‌గారు భారతదేశంలో అతి పెద్దదైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆరుకోట్ల ప్రజానీకానికి ప్రాతి నిధ్యం వహిస్తున్నదని పేర్కొంటూ, "ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు రాష్ట్ర ప్రగతికి అమెరికా వచ్చా"రన్నారు.

"అమెరికా దేశంలో నివసిస్తున్న ఆంధ్ర ప్రజానీకం సామాజిక పరమైన వైద్య, విద్యా, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక, సాహిత్య, కళా రంగా లలో; ఆధ్యాత్మిక చింతనా విధానాలలో, వ్యాపారిక వ్యవహారాలలో, సామా జిక సంక్షేమ కార్యక్రమాలలో పాలు పంచుకుంటున్నారు, అభివృద్ధికి దోహదం చేస్తున్నారు. కనుక ఈ జూన్ 17వ తేదీ చికాగో నగరంలో ఆంధ్రప్రదేశ్ పర్వదినంగా ప్రకటించడం జరిగింది"— అన్నారు.

గుండెల నిండుగా గాలి పీల్చుకున్నాము— గర్వంతో. మనసు పండు వయ్యింది— వారి సమాదరణతో.

ఆదర్శ భావాలతో భిన్నత్వంలో ఏకత్వంగా, ఏక కుటుంబంగా మనుగడ సాగిస్తున్నారు — భిన్న రాష్ట్రాల భారతీయులందరూ కుల మత భేదాలకు అతీతులై అరమరికలు లేకుండా.

హిందువులని, ముస్లిములని, క్రైస్తవులని, శిఖ్ఖులని, తమిళులని, కన్నడిగులని, కాశ్మీరీయులని స్వపర భేదాలు లేకుండా, తారతమ్య భావాలు పాటించకుండా ఒకే మానవ సమాజంగా మనగలుగుతున్నారు — కలి మిడిగా. సహకార దృక్పథంతో, సదవగాహనతో, సోదర భావంతో వెలుగు తున్నారు — ముచ్చటగా.

చికాగోలో తమ పవిత్ర ప్రార్థనా మందిరానికి నన్నాహ్వానించి సమాదరించిన ముస్లింసోదరులు ఆశీః పూర్వకంగా అందించారు—ఖురాన్ పవిత్రగ్రంథాన్ని ఆంగ్ల అనువాద రూపంలో. ఏకకంఠంతో అభిమాన పురస్సరంగా పలికారు ఆత్మీయతను వర్షిస్తూ —'NTR. The man of the year 1984 for human rights'—అని.

సాన్ ఫ్రాన్సిస్కో మహానగరంలోవున్న తమిళ సోదరులందరూ వారి ప్రార్థనా మందిరాలకు ఆహ్వానించారు — భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలకు అనుగుణ్యంగా పూర్ణకుంభాలతో, మంగళ వాద్యాలతో.

వారనీ...వీరనీ...ఎందరని!

అందరూ వర్షించారు ఆశీఃసుమాక్షతలు నాపై.

మనసులో నింపుకున్నాను మధురమైన సదాశీస్సుల గుబాళింపులను.

ఆ మధుర స్మృతులలో మధురాతి మధురంగా సాగింది నా యాత్ర.

మరొకసారి గుర్తుకువస్తోంది మధుర భావనలో— మన ఆడబడుచుల ఆదరణ, అభిమానం, అనురాగం.

నా అలవాట్లను ఎలా తెలుసుకున్నారో నా చిట్టి తల్లులు—సుప్రభాత సమయానికే స్వహస్తాలతో వండిన అమృత తుల్యమైన భోజనం వడ్డించారు విస్తరి నిండుగా, నా గుండె పండగా.

అంతా గుమిగూడి సామూహికంగా సిద్ధంచేసిన తెలుగు వంటకాలను అనుదినం ఆ సభలకు విచ్చేసిన ఎన్నో వేల మంది సదస్యులకు సమకూర్చిన విధానం, ఆ పంక్తి భోజనాలలోని తెలుగుదనం, కమ్మదనం రుచులూరు తోంది—ఆ తెలుగు తల్లుల పాక ప్రావీణ్యాన్ని మరొక్కసారి గుర్తుచేస్తూ— నా జిహ్వపై.

నా నుండి దూరమైన నా కన్నతల్లిని నా కళ్ళముందు నిలిపారు ఎన్నో రూపాలుగా ఆ దివ్య మూర్తులు.

ఆ మధుర మంజుల మనోజ్ఞస్మృతిలో మరచిపోయాను నన్ను నేనే. మంగళారతులిచ్చి, నుదుట తిలకం దిద్ది పరిమళ భరితమైన పుష్పగుచ్ఛాలతో స్వాగతం చెప్పిన వారి సువిధానానికి రుణపడ్డాను మరోసారి...... మరోసారి.

సర్వసంగ పరిత్యాగంతో, నిర్ధనమైన నా పేదరికం నా తెలుగింటి ఆడబడుచులకు ఏ సిరిసంపదలివ్వగలదు?

వారి ప్రేమకు విలువకట్టే షరాబును కాలేను.

మడిమాన్యాలతో అరణమిచ్చే అన్ననూ కాలేను.

అయినా—

అయిదవ తనానికి గుర్తుగా, ముత్తయిదువులకు సౌభాగ్యప్రదమై దివ్యమైన అమ్మవారి అర్చనా పసుపు కుంకుమలు మాత్రం 'సుమంగళీభవ' అని అంటూ అందించగలిగాను వారి అభిమానాన్ని పంచుకున్న అన్నగా. కోరుకున్నాను నిండుగా—వారి జీవితం కలకాలం పచ్చగా, పరిమళంగా, మంగళప్రదంగా, సౌభాగ్య విలసితంగా పరిమళించాలని, పరిఢవిల్లాలని.

వెలికి పలుకలేని ఆప్యాయతతో, మూగవోయిన గొంతుతో, కేరింతలతో, కవ్వింతలతో, బోసినోటి చిరునవ్వుల వెలుగులతో ముక్కోటి దేవతలుగా నా ముందు సాక్షాత్కరించిన ఆ చిట్టి తండ్రులకు, చిన్నారి పాపలకు, చిరంజీవులకు ఏ కానుకలూ తీసుకుపోలేదు.

జగద్రక్షకుడైన భగవంతుడు వారిని చల్లగా చూడాలని, విజ్ఞాన విశేషాలతో, సుఖ శాంతులతో వారి భవిష్యత్తును పండించాలని; ఆదర్శమూర్తులుగా, దేశభక్తి పూరితులుగా, ప్రగతిలో పయనించే భవిష్యత్ పౌరులుగా వారు రాణించాలని రాగి జ్ఞాపకాలు ఆ దేవుళ్ళ రూపాలు వారిచేత నుంచాను — శుభాశీస్సులతో.

తిరుపతి వెంకన్న, శ్రీశైలం మల్లన్న, భద్రాద్రి రామన్న దివ్య ఆశీస్సులను అందించాను కాశీదారంగా, మహా ప్రసాదంగా, సర్వమంగళ రూపంగా.

విలువలకు మించి, సంపదల పరిధుల నధిగమించి, సమాదరించి సాటి భారతీయునిగా నన్ను గౌరవించి సాగనంపిన వారి ముగ్ధమోహన విధానానికి కాషాయాంబర ధారినైన నేను యివ్వగలిగిన కానుకలవే ... అవే.

విలువకన్న మనసే మిన్న అన్న బుద్ధితో అనురాగంలో ముంచి ఆప్యాయతతో నేను అర్పించిన కానుకలవే ... అవే.

ఇది నాకుగా గాదు—మీకుగా, అరవై అయిదుకోట్ల భారతీయులలో ఒకడిగా, ఆరుకోట్ల తెలుగు ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించే మనిషిగా.

నేనై వెళ్ళలేదు.

నే నొక్కడిగా మెలగలేదు.

మీ వాడిగా, ప్రజల మనిషిగా వెళ్ళాను.

ముక్త కంఠంతో, ఉద్వేగంతో, ఆనందపు వెల్లువతో, వెలికిరాని మాటలతో పలికాను— ఇక్బాల్ మహాకవి మధుర వాక్కు.

సారే జహాఁసె అచ్ఛా
హిందుస్తాఁ హమారా
హమ్ బుల్‌బులేహైఁ ఉస్కే
ఏ గుల్‌సితాఁ హమారా.

ఎలావున్నా, ఎక్కడ వున్నా, ఏ పనిచేస్తున్నా రాష్ట్ర భేదాలు మన దరికిరావు. మత వైషమ్యాలు మనల్ని విడదీయలేవు. అందరం భరత మాత ముద్దు బిడ్డలం.

మజహబ్ నహీఁ సిఖాతా
ఆపస్‌మే బైర్ రఖనా
హిందీహైఁ హమ్
వతన్‌హై హిందూ సతాఁ హమారా

మనసు పరవశించిపోయింది — పండు వెన్నెలలో, అనురాగపు జల్లులలో.

ఇంతకన్న నా జన్మకు సార్థకం ఏముంటుందని !

పెన్సిల్వేనియన్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ యంగ్ గారు నాకు ప్రత్యేకమైన ఆహ్వానాన్ని అందించి, తెలుగుదేశ ప్రభుత్వ విద్యావిధానాలకు హర్షామోదాలను వెలిబుచ్చి, తెలుగుదేశ ప్రభుత్వం అమలుపరచదలచుకున్న వృత్తిపరమైన సాంకేతిక విద్యా విధానానికి ఆమోదం వెలిబుచ్చుతూ— "మీకు ఆనరరీ డాక్టరేటు ఇవ్వాలని నా నిర్ణయం. అయినా మీ రిక్కడకు వచ్చినప్పుడు కాదు, ఇక్కడ కాదు. తెస్తాను మీ దేశానికి, ఇస్తాను మీ హైదరాబాదు నగరంలో" అని అన్నప్పుడు ఇది ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో అని సంబరపడ్డాను సంతోష స్వాంతంతో.

ఈ కార్యక్రమాలలో పాల్గొన్న ప్రభుత్వాధికారుల, మిత్రుల అత్యుత్తమమైన సేవలను, ఉన్నత భావ సంపుటీకరణ విధానాన్ని నా అమెరికా యాత్రను విజయవంతంగా, ప్రయోజనకరంగా మలచడానికి వివిధ శాఖలలో, వివిధ స్థాయిలలో జరిగిన నిరంతర నిర్విరామ కృషిని నేను హర్షిస్తున్నాను, అభినందిస్తున్నాను.

ఆ పొంగులో నింగి కెగసిన నా ఆవేశాన్ని చూసిన తెలుగు బిడ్డలు కొందరు అడిగారు నన్ను— "మీ జీవిత రహస్యం ఏమిటని? ఈ నిర్విరామ కృషికి మూలాధారం ఏదని?"

పిడికిలి బిగిసింది అనుకోకుండా నా శరీర పటుత్వానికి నిదర్శనంగా.

అయినా—

కోరింది వారి విజ్ఞత— పరీక్షించి చూద్దామని.

తేల్చింది ఆధునిక వైద్య విజ్ఞానశాస్త్రం — నిరంతర కృషిలో నా గుండెలోని ఒక రక్తనాళం నలిగిపోయిందని.

నిరాశ లేదు.

నిస్పృహ లేదు.

ప్రాణభయం అంతకంటే లేదు— మొక్కవోని యీ గుండెకు, అచంచలమైన నా ఆత్మ విశ్వాసానికి.

అయినా యెందరు హితులు, ఎందరో హితైషులు అడిగిన సరళిని కాదవలేక అంగీకరించాను తిరిగి అమెరికాకు వస్తానని — వారి విజ్ఞానాన్ని గౌరవిస్తూ, వారి ఆలోచనలను అంగీకరిస్తూ.

నా జీవితగతి ఎప్పుడో నిర్ణయమయ్యింది.

నా బ్రతుకు నా జాతికి ఏనాడో అంకితమైంది.

నా జీవం మీరు.

నా ఊపిరి మీరు.

కనుకనే మిమ్మందరినీ ఆహ్వానించాను యీనాడు — నన్ను ఆశీర్వదించమని.

మీ అనుమతితో వెళ్ళివస్తాను.

కాని వెళ్ళేముందు నా తొలి అమెరికా యాత్ర నా దేశానికి ఏమి తెచ్చింది? ... నా తెలుగుజాతికి ఏమి గడించి పెట్టింది? ... నా వారికి ఏ ప్రగతి వెలుగులు పంచి యిచ్చింది?— అన్న వివరం మీకు సమర్పించదలిచాను.

కనుకనే మీకు శ్రమ కలిగించాను.

ఇంతదూరం రప్పించాను.

మంచే చేశానో, మరేమి చేశానో, నావల్ల నా జాతికి, నా వారికి, నా దేశానికి నిండుతనం కలిగిందో, ఆత్మగౌరవం పెరిగిందో తేల్చవలసింది, నిర్ణయించవలసింది మీరు.

న్యాయ నిర్ణేతలు మీరు

అదే యీనాటికీ, ఏనాటికీ నేను కోరుకొనే ప్రజాస్వామ్యవిధానం.

జై తెలుగునాడు .... జై హింద్

---

*1984 జూలై 15వ తేదీన హైదరాబాదు, లాల్ బహదూర్ స్టేడియంలో నిర్వహించబడిన ప్రజానదస్సులో ముఖ్యమంత్రి ప్రసంగం*

# తెలుగు రాష్ట్రాభివృద్ధి కృషిలో భాగస్వాములుకండి

ఈ అమెరికా అఖండ భూభాగంలో వున్న విజ్ఞానవేత్తలకు, శాస్త్ర సాంకేతిక విజ్ఞాన శేముషీ దురంధరులకు, భారతీయ సాంప్రదాయ వికాసాలకు ఒక ఆకృతిగా, ఒక వారధిగా సారథులై, పుట్టిన దేశానికీ అఖిల భారత జాతికీ కీర్తి గడించి పెడుతున్న సాంస్కృతిక రాయబారులు మా అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్ళకు —

ఎంతో సహనంతో, ఔదార్యంతో, విశాల దృక్పథంతో స్వపర భేదాలు, తరతమ భావాలు లేకుండా విశ్వ సౌభ్రాతృత్వమే, సర్వ మానవ కల్యాణమే పరమార్గంగా మా వారందరినీ సోదరభావంతో, మానవతా దృక్పథంతో ఆదరించి గౌరవిస్తున్న యీ దేశీయ వాసులూ, స్నేహశీలురూ, విజ్ఞాన ధనులూ, పారిశ్రామిక ప్రగతికి ప్రతీకలుగా వున్న ప్రియమైన అమెరికన్ సోదరీ సోదరులకు—

ఆరుకోట్ల తెలుగు ప్రజానీకం తరఫున, తెలుగు దేశం ప్రభుత్వం తరఫున, నా తరఫున, సమర్పిస్తున్నాను — ఈ సుహృద్భావ యాత్రాసుమాంజలి.

అందిస్తున్నాను సుమధుర పరిమళ భరితమైన తెలుగునాటి గుబాళింపులు, ప్రేమ పురస్సరమైన మా అభిమాన పరంపరలు, ఆదరింపులు.

తెలియజేస్తున్నాను శుభాకాంక్షలు, శుభాభినందనలు.

ఈ పరిచయం మధురాతి మధురమై, చిరస్మరణీయమై ఒక పవిత్ర సమ్మేళనకూ, తీయని బాంధవ్యానికీ నాంది పలుక గలదని నా పరిపూర్ణ విశ్వాసం.

ఎన్నో ఏళ్ళుగా ఈ సుదూర తీరాలకు చేరిన నా వారిని పలకరించాలని, వారిపట్ల ఎంతో ఆదరణ చూపుతున్న మిమ్మల్ని అందర్నీ దర్శించాలని నా ఆశ, ఆకాంక్ష.

ఆ భావమే యీ నా అమెరికా యాత్రకు ఆలంబనం.

విశ్వజనీన దృష్టితో, సౌభ్రాతృత్వ సౌశీల్యాలతో విదేశాలలో కాలూని, మీ విజ్ఞానప్రాభవంతో, శేముషీ వైభవంతో, పుట్టిన గడ్డకు ఖ్యాతి గడిస్తూ, వున్న చోట సామాజికాభివృద్ధికి సాయపడుతూ వున్న సుమారు 3 లక్షల 50 వేల మంది తెలుగు సోదరీసోదరుల అవిరళ కృషి మాకెంతో గర్వకారణం.

భారతదేశం మీకు కొత్త కాదు.

తెలుగునాడు మీరు ఎరుగనిది కాదు.

అన్ని వనరులతో, నిధి నిక్షేపాలతో, జీవనదులతో, పచ్చని పంట చేలతో ప్రగతి పథంలో ముందడుగు వేస్తోన్న జీవగడ్డ—తెలుగు గడ్డ.

ఈనాడు తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పడ్డది అఖండ ప్రజాబలంతో.

ముందుకు సాగుతోంది ప్రజలందరి విశ్వాసంతో, అభిమానంతో, అండదండలతో.

ప్రజలు ఆశిస్తున్నారు కొత్త ప్రభుత్వం ఏదో నూతనత్వాన్ని ఆవిష్కరిస్తుందని—

ఆధునిక సాంకేతిక ప్రక్రియలతో వారి ఆశలను, ఆకాంక్షలను పుష్పింపజేస్తుందని—

వారి జీవితాలలో ఆనంద నందనాలు వెలయిస్తుందని.

ఆ ఆలోచనల పర్యవసానమే నేను మీ ముందుకు రావడం.

తెలుగు వాడిగా, మీ వాడిగా యీ మహాయజ్ఞంలో పాలుపంచు కోమని మిమ్మల్ని కోరడం.

జననీ జన్మభూమిశ్చ
స్వర్గాదపి గరీయసీ

ఏ దేశమేగినా ఎచట కాలిడినా తల్లి నేలను మరువని ధన్యజీవులు మీరు

ఎక్కడ వున్నా, ఏ ప్రాంతంలో వున్నా తెలుగు గడ్డ నాటికీ నేటికీ ఏనాటికీ మీదే. తెలుగు రాష్ట్రాభివృద్ధి కృషిలో భాగస్వాములు కావాలని మీరెంతో ఉత్సాహంతో, చొరవతో ముందుకు రావడం అత్యంత అభినందనీయం.

మీ చైతన్యంతో, మీ సంపత్తితో, మీ విజ్ఞాన వెల్లువతో కన్నతల్లి మనసు పరవశింప జేయమని కోరుతున్నాను.

తెలుగు తల్లి అనుంగు బిడ్డలుగా మీరు ఆ తల్లి సంక్షేమానికి, తృప్తికి, తుష్టికి, పుష్టికి నిండుదనంతో, నిండుమనసుతో తోడుపడాలని, తెలుగునాట నాలుగు చెరగులా వెన్నెలలు విరియింప జేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ పవిత్ర కృషిలో ప్రభుత్వ అండదండలు మీ కెల్లప్పుడూ వుంటాయని మనవి చేస్తున్నాను.

భిన్నత్వంలో ఏకత్వం సంతరించుకొన్న సంస్కృతి — యీ అఖండ అమెరికా వాసులది.

అందరి సమిష్టి కృషితో కేంద్రీకృతమైన జాతీయభావంతో, ఆప్యాయతతో, సోదర ప్రేమతో ప్రగతిని సాధించిన పవిత్రమూర్తులు మీరు.

అనూహ్యమైన అంతస్తుకు ఎదిగింది మీ అందరి కృషితో మీ దేశం.

పరిపూర్ణమైన అవగాహనతో, దీక్షాబద్ధమైన లక్ష్యసాధనతో ప్రపంచంలో వున్న అత్యున్నత దేశాలలో మీ దేశానికి అతి విలువైన స్థానం కల్పించ గలిగారు. ఇంతకంటే మీ సమైక్యకృషికి వేరుగా వేరుగా ఇంకొక ఉదాహరణ చెప్పవలసిన అవసరం లేదు.

ఇటువంటి ఉత్తమ స్థాయిలో వున్న మీరు మీ ప్రజ్ఞా ప్రాభవాలను ఈ ప్రపంచ సమాజానికి పంచిపెట్టడం ఎంతైనా అవసరం. కనుక మా కృషిలో మీ అండదండలు ఉంటే బంగారానికి సువాసనలు అబ్బినట్టు వుంటుందని నా భావన.

ఈనాడు తెలుగునాడునుండి నా వెంట ఇక్కడకు వచ్చారు పారిశ్రామికవేత్తలు ఎందరో — సహకార భావంతో, సౌజన్య శీలంతో, సమధికోత్సాహంతో.

మీ ఇరువురి మధ్య నేడు అంకురించే అవగాహన పెంపొందే ఆలోచనా పరంపర ఆంధ్రప్రదేశ్‌లో ఒక కొత్త వ్యవస్థను, నూతన చైతన్యాన్ని, అనువైన వాతావరణాన్ని, ఆదర్శవంతమైన విధానాన్ని సృష్టించేందుకు దోహదం చేయగలదని ఆశిస్తున్నాను.

చేయీ చేయీ కలసినప్పుడే ధ్వని పుడుతుందన్నట్టుగా నిండు మనసులు రెండూ కలసినప్పుడే ఉన్నత స్థాయిలో ఉదాత్త రీతిలో, ఉత్తమ ప్రగతిశీల వ్యవస్థలు రూపొందే అవకాశం వుంటుంది.

అందుకే మీరూ, నా వెంట వచ్చిన వీరూ కలిసి అరమరికలు లేకుండా అన్ని విషయాలూ చర్చించుకోమని, ఆమూలాగ్రంగా విషయ పరిశీలన చేసుకొమ్మని, ఆదర్శవంతమైన అభివృద్ధిపథకాలు రచించుకొమ్మని అభ్యర్థిస్తున్నాను.

ఈ అమూల్యమైన భావనలన్నీ కలబోసి వడబోసినట్లయితే ఉభయ తారకమై యిరు దేశాలకూ ఏదో మంచి జరుగుతుందని నా అభిప్రాయం. ఒక స్పష్టమైన అవగాహన, సరైన సహకారం, ఒక సముచిత ప్రగతిశీల ప్రణాళిక అవతరిస్తాయని నా విశ్వాసం.

ఈ మానవతా సిద్ధాంతం, ఈ పవిత్ర భావం, ఈ అపూర్వ కలయిక ఏదో కొత్తదనం తేవాలని నా అభిలాష.

ఇందువల్ల మున్నెన్నడూ జరుగని ఒక మంచి జరగాలని నా ప్రయత్నం.

ప్రజాస్వామ్య విధానానికి యీనాడు ప్రతీకలుగా నిలిచి అద్దం పట్టాయి మన రెండు దేశాలు. ప్రజాస్వామ్య వ్యవస్థకు సరైన నిర్వచనం యిచ్చి, ప్రజాస్వామిక విధానానికి ఆదర్శంగా వున్న దేశాలలో ప్రశస్తి గడించాయి—మన రెండు పెద్ద భూభాగాలు.

ప్రజల హక్కుల పరిరక్షణ, ప్రజల కోసమే పాలన, అతి సామాన్య మైన మానవునికి కూడా ప్రాథమిక నిత్యావసరాలను సంతృప్తిగా అందిం చాలన్న కృషి మన ఆదర్శం. ప్రభుత్వమే ప్రజలు, ప్రజలకోసమే ప్రభుత్వం—అనే నిర్దుష్టమైన అవగాహనతో ప్రజావాణికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చి గౌరవిస్తున్నప్రజాహిత సిద్ధాంత పరమైన పేరెన్నికగన్న రాజ్యాంగ విధానాలు మనవి.

అందుకే ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు రూపొందాయి యిరు దేశాల సహకారంతో. అందుకే మన రెండు దేశాల మధ్య సద్భావన, సుహృద్భావాలు పెంపొందుతున్నాయి తరతరాలుగా. అందుకే యీనాడు సుమారు 3 లక్షల 50 వేల తెలుగు బిడ్డలు మీ సమాజంలో మిళితమై అత్యుత్తమమైన సామాజిక సేవా భావంతో మీ సమాజానికి సేవ చేయ గలుగుతున్నారు. అది మన ఉభయదేశాల మధ్య నెలకొన్న సదవగాహనకు, చక్కని మైత్రికి సరియైన నిదర్శనం.

ఈ మైత్రి పెంపొందాలని, యీ సదవగాహన చిరకాలం వర్ధిల్లాలని, ఒకరి విజ్ఞానం, ఒకరి వికాసం మరొకరికి క్షేమకరం కావాలని మనసారా కోరుకుంటున్నాను. ఈ ప్రజాస్వామ్య విలువలు నిండుగా వికసించిననాడు, ప్రాపంచిక మానవ సమాజమే ఒకటని యీ హోరవడి చాట గలిగిననాడు —ఆనాడే అవతరిస్తుంది నిజమైన వసుధైక కుటుంబం. ఆనాడే లభిస్తుంది మానవ కృషికి ఒక తృప్తి, నిండుదనం.

ప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తున్న సాంకేతిక విజ్ఞానం వివిధ దేశాల ప్రజలను సన్నిహితులను చేస్తోంది. దగ్గరకు చేరుస్తోంది. ఆధునిక ప్రపంచంలో ఎవరికివారై వుండలేరు. ఒకరినొకరు అధిగమించాలన్న ఉత్సాహం, ఆవేశం నూతన శాస్త్ర పరిజ్ఞానం విజయ పరంపరలకు వైతాళికగానం చేస్తున్నాయి.

విజ్ఞాన వెల్లువ విస్తరిస్తోంది—విశ్వమంతటా. ప్రపంచ పరిధులను దాటి, గ్రహాంతర రహస్యాలను శోధించి, ఛేదించి అనూహ్యమైన మేరకు విస్తరించి అవధులెరుగని అంతరిక్షాల నందుకొంటోంది మానవ మేధా సంపత్తి.

ఈ మానవ విజయ సంక్షేమ కార్యక్రమాలలో, సామాజిక వికాసంలో, విశ్వశాంతి సౌభాగ్య సాధనలో అందరం భాగస్వాములు కావడం సత్సంప్రదాయమని నా భావన.

ఈ శాస్త్ర పరిజ్ఞానం ప్రపంచ వినాశనానికి కారణం కాకుండా సర్వ మానవ వికాసానికి, ప్రగతికి కల్యాణదాయకం కావాలి. ఆనాడే ఈ ఇలా తలమే స్వర్గతలం అవుతుందనడంలో అనుమానం లేదు. అదే మానవ సౌజన్యానికీ, సౌభ్రాతృత్వానికీ, సహకారానికీ నిండైన నిర్వచనం.

కనుకనే కోరుతున్నాను మనందరం యీ పురోగమన కృషిలో భాగ స్వాములం కావాలని.

ప్రకృతి ప్రసాదించిన సహజ వనరులను సక్రమంగా, సత్వరంగా వినియోగించుకొని సౌభాగ్యాన్ని సృష్టించుకోడానికి సాగుతోంది ఈనాడొక పారిశ్రామిక విప్లవం మా దేశంలో.

నేడు నేల యీనినట్లు పారిశ్రామిక రొదలతో అవతరిస్తున్నాయి భారీ పరిశ్రమలు—దేశం నిండుగా, మెండుగా.

విశాఖలో ఉక్కు కర్మాగారం, కాకినాడలో గోదావరి ఎరువుల కర్మాగారం, నాగార్జున రసాయనిక ఎరువుల ఉత్పత్తి కేంద్రం, మంగళగిరిలో అధునాతన టైర్ల కర్మాగారం, అన్నిటినీ మించి పావన గోదావరీ తీర ప్రాంతంలో ఆశాజనకమైన మహోన్నత కృషి సాగుతోంది—సహజ వాయువు, చమురు అన్వేషణకై.

జరిగిన పరిశోధనలే తేల్చి చెబుతున్నాయి యీ కృషి సత్ఫలితాల నిస్తుందని, రాష్ట్ర పారిశ్రామిక చరిత్రను కొత్త మలుపు త్రిప్పుతుందని. చమురు, సహజవాయు వనరులతో అత్యున్నత ప్రమాణాలతో భారీ పారిశ్రామిక కేంద్రాలు ఉద్దీపనతో రూపొందుతాయనడం నిస్సందేహం.

అంతేకాదు అత్యంత ప్రాధాన్యత యివ్వబడుతున్నాయి. ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞాన సంకేతాలైన ఎలక్ట్రానిక్ పరిశ్రమలు, టి.వి. కర్మాగారాలు, టెలిఫోన్ ఉత్పత్తి కేంద్రాలు మొదలైనవి ఎన్నో, మరెన్నో, యింకెన్నో అభివృద్ధి పథంలో పురకలు వేస్తున్నాయి.

విద్యుచ్ఛక్తి సమృద్ధిగా వుంది. అనువైన వాతావరణం వుంది. కృషి కొనసాగుతోంది ప్రత్యక్షంగా.

ఈ నూతన పారిశ్రామిక చైతన్యంలో, యీ నవీన ప్రగతి వెల్లువలో మన అందరి శక్తినీ క్రోడీకరించుకుని సహకార సంపత్తును సక్రమ మార్గంలో సమన్వయించుకొని అత్యుత్తమమైన స్థాయిలో అనూహ్య నూతన విజయాలను ఆవిష్కరించుకోగలమన్న ఆశాభావం నాకుంది.

ఈ అవకాశాన్ని విని యోగించుకుని మీరందరూ స్నేహశీలతతో పారిశ్రామిక, వాణిజ్య సత్సంబంధాలను నెలకొల్పే సద్భావంతో ముందుకు రాగలిగితే, పరస్పర విశ్వాసాన్ని పెంచుకోగలిగితే ఉభయత్ర అభివృద్ధిని సాధించుకోగలుగుతాం. ఈ సమన్వయ కృషిని హర్షిస్తుంది తెలుగుదేశం ప్రభుత్వం. సన్నద్ధంగా వుంది అవసరమైన అండదండలు అందించడానికి.

సువిశాల సాగర తీరాలు దాటి, సుదూర ఖండాలకు దారితీసి వచ్చింది మీరే కాదు, మీ వెంట వచ్చాయి—భారత జాతి విజ్ఞాన ప్రాభవ వైభవాలు, అవిచ్ఛిన్న సంస్కృతీ సంప్రదాయాలు, అమూల్య భాషా వైదుష్యాలు, ఆధ్యాత్మిక భావనా వారసత్వాలు.

సాక్షాత్తు ఏడు కొండల వెంకన్నే తరలి వచ్చాడు ఈ పిట్స్‌బర్గ్ మహా నగరానికి—తెలుగు భక్తి భావనా విధానానికి ఆదర్శమైన ఇలవేల్పుగా.

అసమాన భక్తి ప్రపత్తులతో ఆభగవానుని ఆ మంత్రిస్తున్నారు మీరు.

ఆశీర్వదిస్తున్నాడు ఆ తండ్రి— త్రైలోక్యం మంగళం కురు—అని.

దీనివల్ల మనకు తెలిసింది—ఆరాధనకు దూరంలేదని, ఆత్మీయతకు ఎల్లలు లేవని.

మమత అనే ప్రమిదలో ప్రేమ అనే వత్తిని వేసి, స్నేహమనే చమురును పోసి, అనురాగ దీపికతో వెలిగించ గలిగితే—అదే సత్యమైన స్నేహం. అదే నిత్యమైన భక్తి.

రెండుసార్లు నాకోసమే ఈ సదస్సును — ఈ పారిశ్రామిక మహా సభను —వాయిదా వేసిన మీ ఆదరణకు, ఆప్యాయతకు, ఆపేక్షకు నా కృతజ్ఞతలు తెలుపుతూ ముచ్చటగా ఈ మూడవసారి ఒక ఆకృతి అందుకున్న ఈ పారిశ్రామిక గోష్ఠి సత్ఫలితాలను అందజేయాలని, ఎదురు చూస్తున్న ఎందరికో కన్నులపండువై, ఉభయతారకమై, ఇరు దేశాల మధ్య ఒక పారిశ్రామిక అవగాహనకు దోహదం చేయాలని, కలకాలం మనందరి మనఃఫలకాలపై మనోజ్ఞ భావనా పరంపరలను ఉద్దీపన చేసే ఒక సుమధుర సుధుచిర చిరస్మరణీయానుభూతి కావాలని ఆకాంక్షిస్తున్నాను.

జై తెలుగునాడు—జైహింద్

---

*అమెరికాలోని పిట్స్‌బర్గ్ నగరంలో 8-6-1984వ తేదీన తెలుగు సైంటిస్ట్స్ ఆఫ్ అమెరికా నిర్వహించిన సదస్సులో చేసిన ప్రసంగం*

# రేపటి కోసం మనం బాటలు వేసుకోవాలి

ఎంతో అనురాగంతో ఆప్యాయతతో పూలజల్లుగా ఆదరాన్ని కురిపించి, నన్ను అమెరికా ఖండానికి ఆహ్వానించి, అశేష ప్రేమానురాగాలతో నన్ను పులకరింపజేస్తున్న నా ప్రియ భారతీయ సోదరీ సోదరులకు—ప్రత్యేకించి మా తెలుగింటి ఆడపడుచులకు అన్నదమ్ములకు యివే నా శుభాభివందనాలు.

'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి'.

ఏదేశమేగినా ఎందుకాలిడినా తల్లి నేలను మరువని ధన్యజీవులు మీరు.

మరువ సాధ్యమా మాతృ భారతిని ?

చరిత్ర కందని తొలి యుగాలలోనే వేద పనసలు వల్లించి దశ దిశలను పునీతం చేసిన పుణ్యభూమి భరతఖండం.

అధునాతన పరికరాలు లేకుండానే అంతరిక్షంలో పరిభ్రమించే గ్రహ గతుల్ని అంచనావేసి, గ్రహణాలను గుణించి గణుతికెక్కిన ఖగోళ శాస్త్రజ్ఞులకు జన్మ యిచ్చింది భరతభూమి.

వ్యాస వాల్మీకులు, కాళిదాస భవభూతులవంటి కవి కులాలంకారులకు కన్నతల్లి మనదేశం.

ఎందరో చక్రవర్తులు, ఎందరో శిల్ప చిత్ర చక్రవర్తులు, ఎందరో శాస్త్రజ్ఞులు, ఎందరో పండితులు, ఎందరో వేదాంత మార్గ దర్శకులు, ఎందరో మహావీరులు, ఎందరో సంఘ సంస్కర్తలు, ఎందరో త్యాగ ధనులు, విజ్ఞాన ఖనులు మెట్టిన గడ్డ మనది.

ఆ అమోఘ అమూల్య సంస్కృతీ చరిత్రకు మనమంతా వారసులం.

ఆ మహోన్నత పురా వైభవాలను పునఃప్రతిష్ఠించుకొనే యీ బృహత్తర ప్రయత్నంలో, జాతి పునర్నిర్మాణ కార్యక్రమంలో మనమంతా పాలుపంచుకోవాలి.

ప్రజాస్వామిక ఆదర్శాలకు నిలయమై, సర్వ జనతా సమతా సిద్ధాంతానికి ఆలంబనమై, సర్వతోముఖాభివృద్ధికి ప్రతీకయై వర్ధిల్లే నవభారత్‌ను మనమంతా కలిసి నిర్మించుకుందాం.

గతించిన పతితోపాటు సతిని చితి మంటలలోవేసి సజీవంగా దహించే అమానుష దురాచారాన్ని అంతం చేసిన రాజా రామమోహనరాయ్ సంఘ సంస్కరణాభిలాష మనల్ని నడిపించాలి.

తాను అబలను కాదని, స్వాతంత్ర్య సమరంలో సబలనేనని నిరూపించి కత్తిదూసి కదనరంగంలో వీర విహారం చేసిన భారత నారీమణి మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి ఆవేశం మనకు ఉత్తేజాన్నివ్వాలి.

సత్య అహింసలు సాధనాలుగా, సత్యాగ్రహమే ఆయుధంగా రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యానికి స్వస్తిచెప్పి స్వాతంత్ర్యాన్ని సాధించి పెట్టిన జాతిపిత బాపూజీ సదాచరణే, సత్య అహింసలే మనకు మార్గదర్శకం కావాలి.

జైహింద్ అని తొడగొట్టి, తుపాకిపట్టి, అజాద్ హింద్ ఫౌజును కూడగట్టి 'ఢిల్లీ ఛలో' అంటూ సమరభేరి మ్రోగించిన నేతాజీ త్యాగశీలం మనకు స్ఫూర్తి నందించాలి.

అభినవ మనువుగా ఖ్యాతిగాంచిన నవభారత రాజ్యాంగ నిర్మాత, దళితవర్గ ధృవతార, అట్టడుగు ప్రజల ఆశాజ్యోతి డాక్టర్ అంబేద్కర్ శేముషీ వైభవం, కర్తవ్య సేవాపరాయణత్వం మనకు ఆదర్శం కావాలి.

దుర్భర జీవితాన్ని గడిపే విధవల దురదృష్ట జీవితాల్లో నవోదయానికి నాందిపలికి, పరమ ఛాందస సంఘంతో హోరాహోరీ పోరాడి సమాజాన్ని ఉద్ధరించడానికి దీక్షాబద్ధ కంకణుడై తెలుగునాట విధవా వివాహాలను జరిపించిన సంఘసంస్కర్త వీరేశలింగం సంస్కారభావం మనకు ఉద్దీపన కావాలి.

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూ లెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్

—అని ప్రబోధించి, సంఘంలోని దురాచార మూఢాచారాలను ఎదుర్కొని, కుళ్ళి కంపుకొడుతున్న సంఘాన్ని ప్రక్షాళితం చేయడానికి తన కలం బలంతో తెలుగు సాహిత్యాకాశంలో విప్లవ భావాలు ఉదయించిన జాతీయ భావ ప్రతీక గురజాడ అడుగుజాడే మనం నడయాడుబాట కావాలి.



అలనాటి బ్రిటిష్ ముష్కర సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి, స్వరాజ్యం మా జన్మహక్కని నినదించి మన్యం కొండలలో సింహగర్జనచేసి, మాతృభారతి పాదకమలాలపై రక్తరంజిత పారాణిదిద్దిన తెలుగు బిడ్డ అల్లూరి సీతారామరాజు శౌర్యాగ్ని మనలో వేడి రగిలించాలి.

గత ప్రాభవాన్ని తలచుకొని, వర్తమానంతోనే తృప్తిపడి, భవిష్యత్తును విస్మరించడానికి వీల్లేదు. గతం మనకు స్ఫూర్తి నివ్వాలి. ఉజ్వల భవిష్యత్తుకు వర్తమానం వేదిక కావాలి. సంపదకు ఆలవాలము, సమృద్ధికి నిలయమూ అయిన రేపటికోసం వర్తమానంలో రంగం సిద్ధం కావాలి. అందుకు మనం బాటలు వేసుకోవాలి. ఆలోచనలకు పదును పెట్టాలి. కృషిని అంకితం చెయ్యాలి.



ఆ ధ్యేయంతోనే ఉరకలెత్తుతోంది ఆంధ్రప్రదేశ్—కొత్త చైతన్యంతో. పరవశించిపోతోంది—పచ్చని చేలతో, పసిడి పంటలతో. పురోగమిస్తోంది—పారిశ్రామిక రొదలతో, యంత్ర చక్రాల పరిభ్రమణంతో. ఈ నూతన వికాస ప్రవంతిలో, ప్రగతి వెల్లువలో మనందరం భాగస్వాములం కావాలి.

మీ సాంకేతిక నైపుణ్యం, విజ్ఞానశాస్త్ర వైదుష్యం, మీ శేముషీ ప్రాభవం మీ మాతృభూమి సర్వతోముఖాభివృద్ధికి సువర్ణ సోపానం కావాలి. సర్వమానవ సంక్షేమానికి, విశ్వశాంతి సౌభాగ్యాలకు ఉద్దీపన కలిగించాలి. ఇదే నా అభ్యర్థన. ఇదే నా ఆకాంక్ష.

జాతి కుల మత ప్రాంతీయ విభేదాలు లేకుండా అందరం గొంతు కలిపి వినదిద్దాం — అమరకవి ఇక్బాల్ మధురగీతిని

'సారే జహాఁసె అచ్ఛా
హిందూస్తాఁ హమారా
హమ్ బుల్‌బులేహైఁ ఉస్ కే
ఏ గుల్‌సితాఁ హమారా'

---

విల్స్‌బర్గ్‌లో జూన్ 8 వ తేదీన స్థానిక భారతీయులు ఏర్పాటుచేసిన స్వాగత సమావేశంలో ప్రసంగం

# నిష్కామ కర్మే నిశ్చల శాంతికి మార్గం

తెలుగు విజ్ఞాన విశేషాలకు, కళా సంస్కృతులకు వారథులుగా ఈ అమెరికా దేశంలో తెలుగువారికి ప్రాతినిధ్యం వహిస్తున్న మా తెలుగింటి ఆడపడుచులకు, అన్నదమ్ములకు—

కులం, మతం, జాతి, అనే అడ్డు గీతలకు అతీతంగా అనురాగంతో, సోదర భావంతో అందరూ కలిసి మెలిగేందుకు అనువైన ఆదర్శ వాతావరణాన్ని, సమైక్య సమాజాన్ని సృష్టిస్తున్న ఈ అమెరికా ఖండ వాసులందరికీ ఇవే నా సుహృదభివందనాంజలులు.

'ఇందు గల డందు లేడని సందేహం వలదు' అన్నట్లు అక్కడి దేవుడే యిక్కడ వెలిశాడు. ఆ ఏడుకొండలనుంచి కదలివచ్చాడు కళ్యాణ శ్రీనివాసుడు యీ పిట్స్‌బర్గ్ దివ్య పీఠానికి—మిమ్మల్నందర్నీ పునీతుల్ని చేయడానికి. ఎక్కడ వెలిసినా, ఎవరు తలచినా తన చల్లని ఆశీస్సులతో సౌభాగ్య శ్రీలు కురిపిస్తాడు ఆ ఆపద మొక్కులవాడు; అన్ని లోకాల సంక్షేమం అనుశాసిస్తాడు 'త్రైలోక్యం మంగళం' అని.

ఆ చల్లని తండ్రి అనురాగ భావన, ప్రేమలాలన అసలు అంతరాలే ఎరుగదు. అంతా ఆయన బిడ్డలమే అన్న స్ఫురణ అంతస్థులనే సైపదు.
'ఆత్మవత్ సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి'

ఎంత ఉదాత్త భావన!

అందరినీ తనలాగే చూచుకోగల్గినవాడే అన్నీ సరిగా చూడగల్గినవాడు. అట్టి ఔన్నత్యానికి ఎదిగిననాడు, అంతా నాదేనని అనుకున్ననాడు ఈ లోకమే తనదౌతుంది. ఆనాడు—

'అయం నిజః పరశ్చేతి గణనా లఘుచేతస్యా
ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం'

—నీదనే, నాదనే భావం సంకుచిత మనస్కులకుగాని, విశాల హృదయులకు జగమే ఒక కుటుంబం—అని గ్రహిస్తాడు. అంతర్ముఖుడై పరమాత్మను దర్శిస్తాడు. 'అట్టి దివ్యానుభూతికి, ఆత్మ సందర్శనానికి ధర్మాచరణే దారి కావాలి. ఆనందమయ ఆధ్యాత్మ భావన ఆలంబనం కావాలి.

ఆలోచన తన ప్రత్యేకతగా సంతరించుకొన్నాడు మానవుడు. అర్థంకన్న పరమార్థాన్ని సాధించటానికి ప్రయత్నించటమే పుణ్యపురుషుల లక్షణం. ఆత్మ సంయమనంతో, పరతత్వ భావనతో, ధర్మాధర్మ విచక్షణతో ఎవరయితే అజ్ఞానాంధకారాన్ని పారద్రోలటానికి, ఐహిక బంధాలనుంచి విముక్తి చెందడానికి, సర్వమానవ సంక్షేమానికి, లోక కళ్యాణానికి, ప్రపంచశాంతికి దివ్వె వెలిగించి నిత్య సత్యాన్ని, ధర్మ సూత్రాన్ని ప్రబోధించగల్గుతాడో అట్టి మహనీయుడు మానవ ధర్మ కర్మ నిర్వాహకుడై, తన జీవితానికి తన మనుగడకు సరైన అర్థం, నిర్వచనం యివ్వగలుగుతాడు. ధన్య జీవుడవుతాడు. ఆదర్శ ప్రాయుడవుతాడు. అతడే ఆ పరమాత్మ సృష్టికి, భావనకు ప్రతీకగా నిలిచి, భగవానునికి ప్రతిరూపంగా, ఆ దివ్యమూర్తికి సరయిన సంతానంగా కైవల్య సాధకుడవుతాడు.

అట్టి దివ్యానుభూతి సాధనలో భక్తికి మించిన యోగం లేదు.

'చిక్కడు వ్రతముల క్రతువుల

చిక్కడు దానముల శౌచశీల తపములన్

చిక్కడు యుక్తిని భక్తిని చిక్కిన క్రియ

అచ్యుతుండు సిద్ధము సుండీ, — అని యీ విషయాన్నే ఎంతో చక్కగా ప్రవచించాడు భక్త పోతన ఆంధ్ర మహాభాగవతంలో.

అంకితమైన భావంతో ఆ చిద్విలాస రూపుడైన భగవంతుని క్షణమైనా మనస్సులో నిలుపుకోగలగడం, దర్శించగలగడం మానవ జీవితానికి పరమార్థం. అట్టి ఆధ్యాత్మ భావనకు, ఉదాత్త సాధనకు దోహదం కలిగించడానికే సంకల్పించబడ్డాయి యీ దివ్య స్థలాలు,

పవిత్ర మందిరాలూ. ఈ పవిత్ర స్థలాలకు చేరినప్పుడు మనస్సు భగవంతుడిపై పెట్టి, సర్వం ఆయనకే వదిలిపెట్టి, అరిషడ్వర్గాలయిన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను ఆవలకు నెట్టి, నిష్కామ కర్మడై ఆ నిర్వికల్పుని నిండుగా తదైక్య భావనతో తనలో నిల్పు కోవడమే చిద్విలాసం, చిదానందం.

ఇదే మోక్షసాధనకు ఏకైకమార్గం. ముక్తిపథానికి సులువైన ద్వారం. అందుకే అలనాడు చెప్పాడు కృష్ణ భగవానుడు గీతా ప్రబోధంగా—

'కర్మణ్యే వాధికారస్య మాఫలేషుకదాచన'

కర్మయందే నీకు అధికారం కాని కర్మఫలమందు ఆశ కూడదు. అట్టి నిష్కామ కర్మే నిశ్చల శాంతికి మార్గం.

దీనికి మించిన సోపానం మరొకటి లేదు. ఎవరైతే సర్వసంగ పరిత్యాగుడై, ఫలాపేక్షరహితుడై నన్నే శరణుజొచ్చుతాడో అట్టివాని పాపాలు హరించి మోక్షం ప్రసాదిస్తాను, విచారించవద్దని అభయ మిచ్చాడు ఆ ఆదిదేవుడు గీతాముఖంగా ఆనాడే.

'సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో
మోక్ష యిష్యామి మాశుచ'

—మోక్షమే మానవుని పరమావధి అని, మంచితనమే దానికి మార్గమని, ఆ మంచితనాన్ని ప్రబోధించేదే మతం అని.

అదే మానవ అభిమతం కావాలి.

అదే విశ్వమానవ కళ్యాణానికి దారివేయాలి. ఇటువంటి ఆచరణతో భగవత్సాన్నిధ్యానికి, ముక్తి మార్గానికి దారి వెతుకుతున్న మీరంతా ధన్య జీవులు.

ఆ భక్తి భావ ముగ్ధులైన మీ అందరిలో ఆ చిద్విలాస స్వరూపుడైన ఆ భగవంతుడినే నేను చూడగలుగుతున్నాను.

తెలుగునాటి సంస్కృతీ వికాసాలను, సంప్రదాయ వైభవాలను మీలో సందర్శించగలుగుతున్నాను. సువిశాల సాగర తీరాలను దాటి, సుదూర ప్రాంతాలలో కాలూని, సర్వలోక సర్వమంగళ దాయకమైన భక్తి ప్రపత్తులను అన్ని సంస్కృతుల వారికి, అన్ని దేశాలవారికి, అన్ని భాషలవారికి సమ భాగంగా సమతా భావంతో అందించగలిగిన మీ సమన్వయ కృషి అభినందనీయం, శ్లాఘనీయం, ధన్యం.

సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాప్తి అయిన ఆ భగవంతుడు మీకు, మీ కుటుంబాలకు సుఖ సంతోషాలను, ఆరోగ్య ఐశ్వర్యాలను సర్వదా అనుగ్రహించుగాక.

ఓం తత్సత్

---

*పిట్స్‌బర్గ్‌లో జూన్ 9వ తేదీన వెంకటేశ్వరస్వామి ఆలయ ధర్మకర్తల సంఘ సమావేశంలో చేసిన ప్రసంగం*

# తెలుగు తల్లిని క్రాంతిసీమగా రూపొందించుకోవాలి

ప్రపంచంలో అత్యంత అధునాతన సాధన సంపత్తులను సమీకరించు కున్న దేశంగా విఖ్యాతికెక్కి, విజ్ఞాన శాస్త్ర వికాసాలకు ఆటపట్టయిన యీ అమెరికా దేశానికి రాజధానియై, ఆకాశ హర్మ్యాల అపురూప నగరంగా పరిగణింపబడుతూ, ప్రపంచ శాంతి పథానికి, సర్వదేశాల స్నేహ సుహృద్భావ సహకార వాతావరణానికి దారులువేసే ఐక్యరాజ్య సమితికి ఆలవాలమైన యీ న్యూయార్క్ మహానగరంలో నివసిస్తున్న సోదర భారతీయులకు, అక్క చెల్లెళ్లకు నా సహృదయ నమస్సుమాంజలులు.

సుదూర సాగర తీరాలను దాటి, సువిశాల గగన పథాలను అధిగమించి యిక్కడకు విచ్చేసి, వివిధ రంగాలలో మీ విజ్ఞాన పాటవాలను, శేముషీ ప్రాభవాలను ప్రదర్శిస్తున్న మేధావి వర్గానికి ప్రతినిధులై, భారతదేశానికి కీర్తి ప్రతిష్టలు ఆర్జించిపెడుతున్న విజ్ఞాన ధనులు మీరు.

అతి పురాతనమైన దేశాలలో ఒకటిగా పరిగణింపబడుతూ, ఘనమైన చరిత్రకు, సుసంపన్నమైన సంస్కృతికి నిలయమైన భారతదేశానికి మీరంతా అనధికార సాంస్కృతిక రాయబారులు.

మీ మీ ప్రతిభా సామర్థ్యాలతో, ప్రజ్ఞా పాటవాలతో అటు పుట్టిన గడ్డకు, యిటు మెట్టిన దేశానికీ గర్వకారణమైన సేవ చేస్తున్న ప్రజ్ఞా శీలురు మీరు.

ఏ దేశమేగినా ఎందు కాలిడినా మాతృభూమిని విస్మరించని సత్సంప్రదాయం మీది. స్నేహ సౌశీల్యాలను, సౌజన్య సమాదరణలను తల్లి నేలనుంచి పుణికి పుచ్చుకున్న వారసత్వం మీది.

అందుకే దేశంకాని దేశంలో, ఊరుకాని ఊరులో కూడా మీరు తలలో నాలుకలా కలిసి మెలగ గలుగుతున్నారు. ప్రశంస లందుకొని వెలగ గలుగుతున్నారు.

భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలలో విశిష్టతను ఆర్జించుకుని అమెరికా దేశ చైతన్య ప్రవంతిలో, విజ్ఞాన వెల్లువలో అంతర్లీనంగా ఉత్తమ భాగంగా చిరకాలం సేవ చేయాలి మీరు. శాస్త్రీయాభివృద్ధికి, సాంఘిక ప్రగతికి మీ వంతు కృషిని కొనసాగించి మాతృభూమికి పేరు ప్రఖ్యాతులు తేవాలి మీరు.

అలా ఆ జీవన ప్రవంతిలో కలగలిసిపోయి ఆ దేశానికి సేవ చేస్తూనే తల్లి భారతి రుణం తీర్చుకోడానికి సమాయత్తం కావాలి మీరు.

జన్మ యిచ్చిన తల్లి, పుట్టిన గడ్డ స్వర్గంకన్న మిన్న అన్నారు పెద్దలు. అటువంటి మాతృ భారతి సముజ్వల వైభవానికి, సర్వతోముఖ వికాసానికి మీ విజ్ఞాన విశేషాలు, మీ సాధన సంపత్తులు దోహదంకావాలి.

అదిగో పిలుస్తోంది తల్లినేల— పచ్చని చేలతో, పసిడి పంటలతో, పాలవెల్లువతో పరవశించిపోతోంది. పారిశ్రామిక చక్రాల నిరంతర పరిభ్రమణంతో పరిఢవిల్లుతోంది. సుసంపన్నమైన సంస్కృతీ సంప్రదాయాలకు, ఆధునిక అభ్యుదయ దృక్పథాలకు మేలి కలయికగా అవతరిస్తోంది.

భారీ పారిశ్రామిక కర్మాగారాలు, జలవిద్యుత్ కేంద్రాలు ఎన్నో ఎన్నెన్నో మరెన్నో రాష్ట్రం నలుచెరగుల నవ్యరీతుల్లో రూపాలు దిద్దుకుంటున్నాయి— మన సాంకేతిక విజ్ఞాన వ్యాప్తికి సంకేతంగా, ప్రగతికి చిహ్నాలుగా, ఆధునిక దేవాలయాలుగా, భావి ఆశాసౌధాలుగా.

సాధించింది ఎంతవున్నా సాధించవలసింది వుంటూనే వుంటుంది— మరెంతో.

ఈ తరం శ్రమించాలి నిరంతరం. శక్తి సామర్థ్యాలను మూటగట్టి మార్చుకోవాలి పసిడిపంటగా.

ప్రపంచంలోని ఉత్తమ సాంకేతిక ప్రతిభను తీసుకొని రావాలి మీ అందరూ! ప్రగతి పరిధులను విస్తరించి పారిశ్రామిక శక్తిగా మన రాష్ట్రాన్ని రూపొందించుకోవాలి అంకితమైన విజ్ఞాన ధనంతో!

అసంఖ్యాక ప్రజానీకం ఆశతో, ఆకాంక్షతో ఎదురు చూస్తోంది మహోజ్వలమైన మరో ఉదయం కోసం.

అశేష కార్మిక శ్రామికశక్తి పరిభ్రమిస్తోంది అహరహం—తెలుగు నాడును వెలుగునాడుగా తీర్చిదిద్దుకోవాలని, తెలుగుతల్లిని కల్పవల్లిగా, పాలు తేనెలు పారే భాగ్యసీమగా, సంతృప్తి వెల్లివిరిసే క్రాంతిసీమగా రూపొందించుకోవాలని.

ఈ మహా యజ్ఞంలో మీరూ పాలు పంచుకోవాలని, మీ విజ్ఞాన విశేషాలు, ప్రజ్ఞా పాటవాలు ప్రగతి చక్రాలకు పదును పెట్టాలని, మీ దేశభక్తి, జాతీయతా భావం మాతృభూమిని వెన్నెల వెలుగులో నింపాలని ఆకాంక్షిస్తున్నాను.

మీరూ మీ కుటుంబాలూ నిండుగా చల్లగా పచ్చగా పరిమళంగా కలకాలం పరిఢవిల్లాలని కోరుకొంటూ, ఎంతో ఆదరంతో, అనురాగంతో, ఆప్యాయతతో, అమితోత్సాహంతో మీరంతా నాపై పూలజల్లులా కురిపించిన అశేష ప్రేమాశీస్సులకు, అందించిన అఖండ ఆదర సత్కారాలకు యివే నా కృతజ్ఞతా పూర్వక నమస్సుమాంజలులు.

---

*న్యూయార్క్ నగరంలో జూన్ 10వ తేదీన భారతీయులు ఏర్పాటు చేసిన స్వాగతసమావేశంలో చేసిన ప్రసంగం.*

# ఆదర్శ మానవ ప్రవర్తనకు ప్రతీక-శ్రీరాముడు

శ్రీరామభక్త భావనా పరతంత్రులయిన సదస్యులకు, సుహృద్భావ పూరితులయిన చికాగో వాసులకు, అశేష ఆదరాభిమానాలను నాపై వర్షిస్తున్న తెలుగింటి ఆడపడుచులకు, అన్నదమ్ములకు యివే నా శుభాభివందనాలు, శుభాకాంక్షలు.

'తొలి నే చేసిన పూజాఫలమూ' అని ఆనాడు అమరగానం చేశాడు రామభక్తాగ్రగణ్యుడు, వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజస్వామి. ఆ పునీత క్షణాన్ని తలపించే సందర్భం యిది. ఈరోజు ఈ పవిత్ర సదస్సులో పాల్గొంటూ యిక్కడ మీరందరూ కలిసి నిర్మించదలచిన శ్రీ రామాలయానికి శంకుస్థాపన చేసే అదృష్టం నాకు లభించడం అది 'తొలి నే జేసిన పూజా ఫలమని' అనుకొంటున్నాను.

ఈ శుభ సందర్భంలో యీ రామాలయ నిర్మాణంలో పాలు పంచుకోనున్న కార్మికులకు, శిల్ప కళాకారులకు, ఉడతాభక్తిగా తమ అమూల్య సహాయ సహకారాలను అత్యంత భక్తి ప్రపత్తులతో అందజేసే అసంఖ్యాక భక్త శిఖామణులకు ప్రత్యేకించి నా అభినందనలు తెలియజేస్తున్నాను.

తరలి వచ్చారు తెలుగింటి ఆడపడుచులు, అన్నదమ్ములు అమెరికా ఖండానికి — తమ అశేష శేముషీ సంపదకు ఆదర్శ జీవన పరతంత్రతకు అర్థం చెప్పుకోడానికి, పురుషార్థం సాధించుకోడానికి. మీ వెంటనే తరలి వస్తున్నారు ఒక్కొక్క దేవుడు ఈ గడ్డను పునీతం చేయడానికి.

'కలౌ వెంకట నాయకః'— ప్రస్తుతం నడుస్తున్న కలియుగానికి తరుణోపాయం చూపించే దివ్యధాముడు ఆ ఏడుకొండల వెంకన్న కళ్యాణ శ్రీనివాసుడై ముందు కదలివచ్చాడు — యిక్కడికి. కొంచెం వెనక్కి వెళ్ళితే—

"ద్వాపరే వాసు దేవస్య ..."

గీతామృతాన్ని పంచిన వెన్నదొంగ కన్నయ్య మురళీరవంతో మురిపించవచ్చాడు — ఆపైన యిక్కడకు కృష్ణభక్తి ప్రవంతులు కడలితరంగంలా ఉవ్వెత్తున మిన్నంటుకొనగా.

"త్రేతాయాం రఘు నాయకమ్ ..."

ఇక త్రేతలో అవతరించిన శ్రీరామచంద్రమూర్తి మీ అందరి ఆరాధ్యదైవంగా వెలయాలనుకొన్నాడు యిక్కడ చికాగోలో— తనపేరు పెట్టుకొన్నందుకు యీ తారక రాముడికి ఆలయ శంకుస్థాపన చేసే అదృష్ట భాగ్యం అందిస్తూ.

ఆదర్శ మానవ ప్రవర్తనకు, ధర్మ ప్రవర్తనకు బంగారు బాటలు పరచింది శ్రీరామకథ. ఆ అవతారమూర్తి ఆదర్శ మానవ ధర్మబద్ధ జీవనమే భావితరాల మానవ నైతిక సూత్రాలకు, నడవడికి ఒరవడి పెట్టింది. క్రౌంచపక్షి విరహ విషాదంతో కరిగిన వాల్మీకి హృదయంలో శోకం శ్లోకంగా మారి అద్భుత రసావిష్ట కావ్యంగా ఆధ్యాత్మిక భావనా సంహితగా శ్రీమద్ రామాయణంగా ఆవిష్కృతమయింది — నాటికీ, నేటికీ, ఏనాటికీ మానవ నీతికి, ధర్మరీతికి మూసవోసిన భాషా సంహితగా అలరారుతోంది.

తండ్రిమాట తలదాల్చిన తనయుడిగా తరలి వెళ్లాడు కానలకు చిరునవ్వుతో శ్రీరామచంద్రుడు—పట్టాభిషేకం ఆగిపోయిందన్న బాధ, వేదన రవ్వంత కూడా లేకుండా. గురువృద్ధుల యెడ భక్తికి, భాతృ ప్రేమకు, పరివారంపట్ల ప్రేమాదరణలకు, ఏకపత్నీ వ్రతంవంటి మహోన్నతమయిన ఆదర్శానికి, శిష్టరక్షణ, దుష్ట శిక్షణవంటి ప్రతిజ్ఞా పాలనకు, పరిపూర్ణ ప్రజాహిత రాజ్యాంగ విధానానికి ప్రతీక అయోధ్యా రాముడు. గంగాపుత్రుడు, దళితవర్గాల ప్రతినిధి అయిన గుహుని సాదరంగా తన బాహువులలోనికి తీసుకొని, ప్రేమానురాగాలు వర్షించి, సోదరతుల్యునిగా మన్నించి ధన్యజీవిని చేశాడు— నీతో మనం అయిదుగురం అన్నదమ్ములమన్నాడు.

గిరిజనుల ఆడపడుచు శబరి ఆప్యాయతతో, ప్రేమతో తినిపించిన ఎంగిలి పండ్లే మహా ప్రసాదంగా ఆరగించిన ఆ రామభద్రుడు చెప్పాడు భక్తిభావన కుల వాత భేదా లెరుగదని.

సర్వలక్షణ లక్షితుడై, లక్షలాది పరిచారక వర్గానికి అధిపతియై కూడా ఒక ఆటవికుని — హనుమంతుడిని తన నమ్మినబంటుగా స్వీకరించిన సహృదయుడు సీతారాముడు.

రెక్కలు ముక్కలైనా రక్కసి కోరలనుండి సీతమ్మనురక్షించడానికి మొక్కవోని ధైర్యంతో మోహరించి పోరాడిన పక్షిరాజు జటాయువును తన పితృ సమానుడిగా గౌరవించి కృతజ్ఞతా పూర్వకంగా అంతిమ సంస్కారంచేసి అనుగ్రహించిన కర్మబద్ధుడు ఆ కారుణ్యరాముడు.

తమ్ముడి భార్యను అపహరించి, ధర్మ విరోధం చేసిన వాలిని సంహరించి, సుగ్రీవుని తన ఆత్మీయునిగా మన్నించి నీతో మనం ఆరుగురం అన్నదమ్ములం అన్న స్నేహశీలి ఆ సౌజన్యరాముడు.

పరదారాపహరణ నీతిబాహ్యమని, ధర్మదూరమని అన్నతో వైరం తెచ్చుకొన్న విభీషణున్ని పగవాని తమ్ముడని పరాయిగా చూడక సమాదరించి, అరమరికలు లేని పెద్ద బుద్ధితో అభయమిచ్చి, లంకాధి నాథుని చేసి, నీతో మనం ఏడుగురం అన్నదమ్ములమని అన్న ఆశ్రిత వత్సలుడు, దయాశీలి ఆ దశరథ రాముడు. ఆ రాముడు వేసిన ప్రతి అడుగు మానవజాతికి మార్గదర్శకంగా, ఆయన ఆచరణే ఆదర్శ ధర్మపథంగా పరిఢవిల్లింది.

ఆచరణలో, ఆదర్శాలలో అత్యున్నత శిఖరాలను అధిరోహించడానికి మానవుడు చేసే నిరంతర ప్రయత్నాలకు కొలమానం ఆ పూర్ణపురుషుని దివ్య భవ్య జీవితం.

ఆ అవతారం చరిసమాప్తమై తరాలు దాటాయి, యుగాలు గడిచాయి. భయ సందేహాలమధ్య, అనుమానాందోళనల మధ్య సతమత మవుతున్న మానవాళికి ఆ మాయామానుష విగ్రహుని సత్యప్రబోధం, సరళ జీవనం, ప్రేమ సందేశం ఎప్పటికీ అనుసరణీయాలే. ఆత్మ స్థైర్యానికి ప్రేరణాలే. మానవాళి మనుగడకు ఆ మహనీయమూర్తి మాన్య

జీవితం మూలస్తంభంగా, మానవ సమాజ సంస్కృతీ వికాసాలకు ఆలంబనగా శాశ్వతత్వాన్ని సంతరించుకొన్నది. అట్టి పూర్ణపురుషార్థమైన దివ్య ప్రబోధానికి ఒక స్పష్టమైన ఆకృతిగా, అద్భుత శిల్ప సదనంగా, కన్నుల పండువుగా, కలియుగ వైకుంఠంగా మీ కళాభిజ్ఞతకు, మీ ఆగమ సంప్రదాయాభిమానాలకు అన్నింటికీ మించి మీ భక్తి ప్రపత్తులకు ప్రతీకగా ఈ దేవాలయం, ఈ పవిత్ర ప్రాంగణం రూపు దిద్దుకోగలదని ఆకాంక్షిస్తున్నాను.

సర్వ శ్రేయోదాయకమై, మంగళప్రదమై, సౌభాగ్య సంక్షేమ ప్రదాయియై ఆ సీతారాముల ఆశీః పరంపర మీకు, మీ కుటుంబాలవారికి నిండుగా, మెండుగా లభించాలని, భారతావనిని కర్మావనిగా పునీతం చేసిన పవిత్ర పారమార్థిక భావనా పరంపర మీ సమాజంలో చక్కగా విస్తరించాలని, భక్తి ముక్తికి మార్గమన్న పవిత్రధ్యేయంతో మానవ జీవిత పరమార్థ సాధనాముఖంగా మీరంతా పునీతులు కావాలని, మీ జీవితాలు పచ్చగా సుఖ సంతోష సౌభాగ్యాలతో ఓలలాడాలని మనః పూర్వకంగా నేను కోరుకొంటున్నాను. నాపై అవ్యాజ ప్రేమానురాగాలు, అఖండ ఆదరాభిమానాలు, ఆప్యాయత అవిరళంగా వర్షిస్తున్న నా వారందరికీ, మీ అందరికీ ఇవే నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

సర్వేజనా స్సుఖినో భవన్తు

---

3. *చికాగోలో జూన్ 17వ తేదీన శ్రీ రామాలయ శంకుస్థాపన కార్యక్రమంలో చేసిన ప్రసంగం*

# పిలుస్తోంది తెలుగుతల్లి

తెలుగుదనమే తరలి వచ్చిందా యీనాడు అమెరికా దేశానికి అన్నట్లుగా, నన్నెంతో నిండుగా అపూర్వ ప్రేమాభిమానాలతో ఆదరిస్తోన్న నా వారందరికి, నా తెలుగింటి ఆడపడుచులకు, అన్న దమ్ములకు, చిరంజీవులకు చిట్టి పాపలకు యివే నా శుభాభినందనలు, అభివందనాలు.

వివిధ రాష్ట్రాలనుండి యిక్కడకు వచ్చి, విశిష్ట ఖ్యాతినార్జించుకున్న విమలవర్తనులైన నా భారతీయ సోదరీ సోదరులకు యివే నా నమస్సుమాంజలులు.

చికాగో నగరం పేరు వినగానే వొళ్ళు జలదరిస్తుంది, మేను పులకరిస్తుంది — తొంభై సంవత్సరాలనాడు ప్రపంచ సర్వమతసదస్సులో భారతీయ వేదాంత విజ్ఞాన సంస్కృతీ వికాసానికి, మత ధర్మానికి ప్రతినిధిగా నిలిచిన వివేకానందస్వాముల దివ్య సందేశం స్ఫురణకువచ్చి.

ఆత్మస్థైర్యం, పట్టుదల, పవిత్రత, ఓర్పు, నిర్భయత్వం మానవాభ్యుదయానికి పరమావధులని చెప్పాడు ఆ మహనీయుడు. నేను మీ ఒక్కొక్కరిలో ఆ సలక్షణాలనే చూడగలుగుతున్నాను. కనుకనే మన సంస్కృతీ వికాసాలకు వారసులుగా నిలచిన మీరు మన జాతికే వన్నె తేగలిగారు. ఇక్కడ తృప్తితో, ఆనందంతో నిండుగా జీవించగలుగుతున్నారు.

మన సాంప్రదాయానికి యిది కొత్తకాదు. శాతవాహనులనాడే అలలు తలదన్ని వెలిగింది తెలుగుతేజం. పాశ్చాత్య నాగరికత కళ్ళు తెరవనినాడే ఖండఖండాంతరాలలో వాణిజ్య సంబంధాలు పెట్టుకున్నది.

అట్టి అఖండ అమోఘ సంస్కృతీ వారసత్వ సంపద మనది. ఆ పురావైభవాన్ని పునః ప్రతిష్ఠించుకోవాలి మనం. అపార సహజ వనరులను వినియోగించుకుని అపూర్వ సంపత్తిని సృష్టించుకోవాలి జనం. ఇందుకు యీ తరం పరిశ్రమించాలి నిరంతరం.

అమరకవి గురజాడ ఆశ్వాసించినట్లు—

'వరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్'

కందుకూరి కలలుకన్న సాంఘిక దురాచార నిర్మూలనకు సంసిద్ధం కావాలి యువత. ఆకులో ఆకుగా, చెట్టులో చెట్టుగా అడవులుపట్టి తిరుగుతుండే ఆటవికులను సంఘటితపరిచి బ్రిటిష్ సామ్రాజ్యవాద గుండెలలో నిదురించిన సింహ కిశోరం అల్లూరి సీతారామరాజు త్యాగశీలం కావాలి మనకు ఆదర్శం.

స్వరాజ్యంకోసం సంతోషంగా రక్తతర్పణ చేసిన స్వాతంత్ర్య సమర యోధుల త్యాగాలను సార్థకంచేసే విధంగా నవభారత్‌ను నిర్మించు కుందాం.

ఆ మహత్తర కృషిలో మీరంతా భాగస్వాములు కావాలి.

ఆ పవిత్ర యత్నంలో మీరు పాలుపంచుకోవాలి.

మీ శేముషీ ప్రాభవంతో, విజ్ఞాన విశేషంతో, సాంకేతిక శాస్త్ర పరిజ్ఞానంతో తెలుగునాట ప్రగతిబాటలో వెన్నెలలు విరియించాలి.

ఎక్కడవున్నా, ఏంచేస్తున్నా తెలుగుతల్లి బిడ్డలే మీరంతా. ఎప్పటికీ మీవారమే మేమంతా. ఎవరూ తెంచలేనిది యీ మమతానుబంధం.

'ఏ దేశమేగినా ఎందు కాలిడినా
తలపరా నీ తల్లి భూమి భారతిని
నిలపరా నీ జాతి నిండు గౌరవము'

—అన్నవిధంగా తల్లి దేశాన్ని మరువని మహనీయులని నాకు తెలుసు. కనుకనే పదవీ బాధ్యతలు స్వీకరించినప్పటినుంచి అనుకొన్నాను దేశ దేశాలలో వున్న నావారిని పలకరించాలని, పరామర్శించాలని.

అందుకే వచ్చాను యింతదూరం మమతల మల్లెలు మోసుకొని.

ఎంత దూరాన వున్నా ఏనాటికానాడు నా విజయాన్ని ఆకాంక్షించిన మీ యోచనలు, ఆలోచనలు నా కందుతూనే వున్నాయి— క్షణక్షణం.

ఏమో యిందరు మా తెలుగింటి ఆడపడచుల మంగళాశీః ప్రభావమేమో మా తెలుగుదేశం సాధించిన అఖండ విజయం, ప్రజలచే దత్తమైన యీ అధికారం నావారి ఆత్మగౌరవానికి, తెలుగువారి యశః ప్రాభవానికి, ప్రజా సంక్షేమానికే తిరిగి యిది అంకితం చేయబడాలని నా కోరిక. అందుకే ఆరుకోట్ల తెలుగు ప్రజానీకం ప్రతినిధిగా వచ్చాను మీ సన్నిధికి వారసత్వాన్ని పుణికి పుచ్చుకుని. సంస్కృతీ వికాసాలను వెంట తెచ్చుకున్న మీరు మీ వారికి ఏమిస్తారని అడుగుతున్నాను ఆత్మీయతతో.

ఈనాడు ఎక్కడో ఏ అంతస్తులో వున్నా, ఎంత సిరి సంపదలలో వున్నా, ఏ మహానగరాలలో గుడికట్టుకున్నా మరువరు— మీ పుట్టిన పల్లెను, పెనవేసుకున్న మీవారి మమతానుబంధాన్ని.

గురుతు నాకుంది. మీ గురుతు మీవారి కందించాలి. మీ క్షేమం కోరేవారికి అది శాశ్వతంగా మీ గురుతుగా మిగలాలి.

పిలుస్తోంది తెలుగుతల్లి యీనాడు తన బిడ్డలందరనూ తనఒడిలోకి రావాలని, ప్రాచీన వైభవాన్ని పునరుద్ధరించాలని. తెలుగు యశశ్శం ద్రిదికలకు వన్నె పెట్టాలని, మీ కృషితో తెలుగునాడును వెలుగునాడుగా విరాజిల్ల జేయాలని, తన గర్భంలో దాచుకున్న నిధి నిక్షేపాలను, ఖనిజ సంపత్తిని ఆధునిక పద్ధతిలో అత్యుత్తమమైన రీతిలో పారిశ్రామికీకరణ విధానంలో తన వారసులుగా అందరనూ వినియోగించుకోవాలని.

ఎక్కడ వున్నా మావారు మీరు. ఈ ప్రభుత్వమే మీది. ప్రభుత్వ ప్రతినిధిగా ఆహ్వానిస్తున్నాను రాదలచిన వారందరిని. కోరుతున్నాను యీనాడు ప్రభుత్వం అందిస్తున్న సహాయ సహకారా లందుకోమని.

జై తెలుగునాడు — జై హింద్

---

*చికాగోలో జూన్ 17వ తేదీన తెలుగు అసోసియేషన్ ఆఫ్ గ్రేటర్ చికాగో ఏర్పాటు చేసిన స్వాగత సభలో ప్రసంగం*

# విధాన సభలో ముఖ్యమంత్రి ప్రకటన

అనేకమంది భారతీయులు, భారత సంతతి ప్రజలు విదేశాల్లో వుంటున్నారు. ప్రస్తుతం విదేశాల్లో అటువంటి భారతీయులు సుమారు ఒక కోటి మందివరకు వున్నారని అంచనా. విదేశాల్లోవుంటున్న భారతీయుల్లో కొంతమంది భారతదేశానికి తిరిగి వచ్చేయాలని, ఏ వ్యాపారాన్నో, ఏ పరిశ్రమనో స్వంతంగా ఏర్పాటు చేసుకోవాలని చాలా ఆసక్తితో ఉన్నారు. విదేశాల్లోని భారతీయులనుండి, ముఖ్యంగా అమెరికాలోని భారతీయులనుండి విడివిడిగా, సంస్థల ద్వారా నాకు ఉత్తరాలు వస్తున్నాయి. నన్ను వారి దేశానికి రమ్మని, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక ప్రగతికృషిలో తాముకూడా పాలుపంచుకోడానికి అవకాశాలు కల్పించమని ఉత్తరాలు, విజ్ఞప్తులు అనేకం నాకు అందుతున్నాయి.

ఈ ఆహ్వానాలను దృష్టిలో వుంచుకొని, మన రాష్ట్రంయొక్క సత్వర సాంఘిక ఆర్థికాభివృద్ధికి వనరులను సమీకరించవలసిన అవసరాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ నుంచి వెళ్లినవారు అత్యధిక సంఖ్యలో వున్న అమెరికా దేశాన్ని సందర్శించాలని ఆలోచించాను. రాష్ట్ర అవసరాలను, అమెరికాలోని భారతీయుల వనరులను-వారి ఆర్థికమైనవేకాక సాంకేతిక పరమైన, యాజమాన్యపరమైన శక్తి సామర్థ్యాలను రాష్ట్రాభివృద్ధికి క్రోడీకరించుకోడానికి, సమన్వయపరచడానికి ఈ పర్యటన ఉద్దేశించ బడింది. కేవలం పరిశ్రమల స్థాపనకే ఈ పర్యటన పరిమితం కాలేదు. వైద్య ఆరోగ్యరంగాలకు, విద్యారంగానికి, గ్రామీణాభివృద్ధికి, సాంస్కృతిక వ్యవహారాలకు సంబంధించిన రంగాలకు కూడా విస్తరింపజేయడం ఈ పర్యటన ఉద్దేశం.

పరిశ్రమల శాఖ కార్యదర్శి శ్రీ టి. యల్. శంకర్, ఐ.ఏ.ఎస్., ముఖ్యమంత్రి ప్రత్యేకకార్యదర్శి శ్రీ యు.బి. రాఘవేంద్రరావు, ఐ.ఏ.ఎస్., రహస్య సమాచార సేకరణ విభాగం డి.ఐ.జి. శ్రీ వి. అప్పారావు, ఐ.పి.ఎస్., ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ అధ్యక్షులు శ్రీ బి. రామయ్య,

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ వైస్ ఛైర్మన్, మరియు మేనేజింగ్ డైరెక్టర్ డా|| పి. యల్. సంజీవరెడ్డి, ఐ.ఏ.ఎస్., F.A.P. C.C.I. అధ్యక్షులు శ్రీ డి. సీతారామయ్య, ఫెడరేషన్ ప్రతినిధులు మరి కొంతమంది నా ఆధ్వర్యంలో 1984 జూన్ 6వ తేదీన అమెరికా పర్యటన సందర్భంగా హైదరాబాదు నుండి బొంబాయికి బయలు దేరాం.

ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక అవకాశాలను గుర్తించి, అమలు జరప డానికి కొన్ని నిర్దిష్టమైన ప్రతిపాదనలను రూపొందించడానికిగాను 1984 జూన్ 8, 9 తేదీల్లో పిట్స్‌బర్గ్‌లో అమెరికాలోని తెలుగు శాస్త్ర వేత్తల తొలి సదస్సుకు ప్రారంభోత్సవంతో ఈ ఉత్తర అమెరికా పర్యట నకు శ్రీకారం చుట్టినట్టయ్యింది. అమెరికాలోని భారతీయ శాస్త్రవేత్త లకు, వారి కుటుంబాలకు భారత ప్రజల తరఫునా, మన ఆంధ్రప్రదేశ్ ఆరు కోట్ల ప్రజానీకం తరఫునా శుభాకాంక్షలను తెలియజేస్తూ, అమెరికా లోని భారతీయ ప్రజలను—ముఖ్యంగా అక్కడి తెలుగువారిని—తమసాంకేతిక, ఆర్థిక, యాజమాన్య వనరులను వినియోగించి, తద్వారా రాష్ట్రంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలలో పాలుపంచుకోవలసిందిగా విజ్ఞప్తి చేశాను. కోకొల్లలుగా హామీలను యివ్వడానికిగాని, లేదా కోకొల్లలుగా రూపాయల్నీ, డాలర్లను మోసుకుపోవడానికిగాని నేను అమెరికాకు రాలేదని విస్పష్టంగా అక్కడివారికి తెలియజేశాను. విదేశాల్లోని భారతీయులను ఆంధ్రప్రదేశ్‌కువచ్చి ఉత్పత్తిదాయకమైన పరిశ్రమలువంటి వాటిలో పెట్టుబడులు పెట్టమని అడిగానంటే— ఈనాడు వారు ఈ స్థితికి రావ డానికి దోహదంచేసిన తమ మాతృభూమి రుణం తీర్చుకోమని, రాష్ట్రంతో ప్రయోజనకరమైన సంబంధ బాంధవ్యాల్ని పునః ప్రతిష్ఠించుకోమని మాత్రమే అడుగుతున్నానని వారికి చెప్పాను.

రాష్ట్ర సత్వర పారిశ్రామికీకరణ, పేదరికం నిర్మూలన, పరిశ్రమల వికేంద్రీకరణ, యువజనులకు ఉపాధి సౌకర్యాల కల్పనలకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వ విధానాలను నేను నా ప్రారంభోపన్యాసంలో స్పష్టంగా

